THE ANDHRA PATRIKA - MADRAS.

గవర్నరు ప్రసంగంపై రాష్ట్రి అసెంబ్లీలో మూడు రోజుల చర్చ ప్రారంభం —4 వ పేజీ

# ఆంధ్రపత్రిక

318488

8 పేజీలు వెల 1 అణా. హాలీ 0-1-2.

కొత్త పన్నులు లేనందుకు హైద్రాబాద్ అసెంబ్లీ కాంగ్రెస్ సభ్యుల హర్షం —8 వ పేజీ

Regd. No. M. 1118 సంపుటం 39. సంచిక 336 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. బుధవారము 11-3-1953

# నాయకుని ఎన్నికకు అసెంబ్లీ ఆంధ్రకాంగ్రెస్ సభ్యుల సమావేశం



మార్షల్ స్టాలిన్ మృతికి మాస్కోలో ఖిన్నులైన ప్రజలు లెనిన్ స్టాలిన్ స్మారక చిహ్నం వద్ద చేరి తమ శ్రద్ధాంజలి సమర్పించుకొంటున్నారు.



అంతిమ నిద్రావస్థలో శయానుడైయున్న మార్షల్ స్టాలిన్‌ను చూడడానికై మాస్కోలో పదిమైళ్ళ పొడుగు బారుతీరిన ప్రజాశ్రేణిలో ఒక భాగం.

## ఈ19 వ మద్రాసులో జరుగుతుందని శ్రీసంజీవరెడ్డిగారి ప్రకటన

### ఒకరోజు ముందుగా ప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గ సమావేశం

న్యూఢిల్లీ, మార్చి 9: మద్రాస్ రాష్ట్రి అసెంబ్లీలోని ఆంధ్ర కాంగ్రెసు సభ్యుల సమావేశం ఈనెల 19 వ తేదీన మద్రాసులో జరుగుతుందని ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు నీలం సంజీవరెడ్డిగారు ప్రకటించారు. త్వరలో ఆంధ్రరాష్ట్రమేర్పడుతున్నది. కనుక ఇప్పుడటువంటి సమావేశం ఏర్పాటుచేసి ఆంధ్రకాంగ్రెసు అసెంబ్లీసభ్యులు తమ నాయకుని ఎన్నుకొనడానికి వీలుగా ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు ఈసమావేశం ఏర్పాటుచేస్తున్నట్లు తెలుస్తున్నది.

విజయవాడలో యీ నెల 12 వ తేదీన జరుగవలసిన ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గ సమావేశం వాయిదా పడింది. ఈ నెల 18 వ తేదీన మద్రాసులో ప్రదేశ్ కాంగ్రెసు సమావేశం జరుగుతుంది. పి. టి. ఐ.

శాసన సభలోని ఆంధ్ర కాంగ్రెస్ సభ్యులు 19 తేదీ అపరాహ్ణం 2-30 గంటలకు శాసనసభ కాంగ్రెస్ పార్టీ కార్యాలయంలో సమావేశమౌతున్నారు. కాంగ్రెస్ అధ్యక్షుడు నెహ్రూ సూచనను అనుసరించి శ్రీ సంజీవ రెడ్డిగారు ఈ సమావేశాన్ని ఏర్పాటు చేసినట్లు తెలుస్తున్నది.

### సభ్యులకు నోటీసు

మద్రాసు, మార్చి 10: ఆంధ్ర ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుని ఆదేశానుసారం మద్రాసు అసెంబ్లీ సభ్యుడు శ్రీ టి. యన్. వెంకట సుబ్బారెడ్డిగారు ఈ సమావేశం గురించి అసెంబ్లీ ఆంధ్రసభ్యులకు తెలిపినట్లు ఇక్కడ విచారించగా తెలుస్తున్నది.

### ఆంధ్ర శాసనసభ్యుల సమావేశ తీర్మానాలు

మద్రాసు, మార్చి 10: ప్రస్తుత ఆంధ్ర శాసనసభ్యులనే నూతనాంధ్ర రాష్ట్రి శాసనసభ్యులుగా వ్యవహరించనివ్వాలనీ, ఆరంభంలో రెండు సభలూ ఉండాలనీ, ప్రజాస్వామ్య పక్షాలన్నీ కలసి స్థిరమైన ప్రభుత్వం ఏర్పరచేందుకు పరిస్థితులు అనుకూలంగా ఉన్నవనీ కడప కోటిరెడ్డిగారి అధ్యక్షతను నిన్నరాత్రి శాసనసభల కాంగ్రెసుపక్ష కార్యాలయంలో జరిగిన ఆంధ్ర కాంగ్రెసు శాసనసభ్యుల సమావేశంవారు తీర్మానించారు. 85 మంది రెండుసభలకు చెందిన శాసనసభ్యులు హాజరయ్యారు. తెనుగుమంత్రులు అయిదుగురూ సమావేశానికి వచ్చారు. సభవారు ఈ తీర్మానాలు చేసి భారత రిపబ్లిక్ అధ్యక్షులకు, ప్రధానమంత్రికి, ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షులకు పంపించారు.

"ఆంధ్ర రాష్ట్రిము నిర్మాణమైనప్పుడు ప్రస్తుత శాసనసభ్యులనే నూతనాంధ్ర శాసనసభగా వ్యవహరించనివ్వాలనీ, కొత్తరాష్ట్రిం ఏర్పడినప్పుడు వివిధ సమస్యల పరిష్కరించడానికి ప్రజాస్వామ్య ప్రభుత్వము ఉండుట యుక్తమూ, అవసరమూ అని ఆంధ్రకాంగ్రెసు శాసనసభ్యులు దృఢమైన అభిప్రాయమును వెల్లడించుచున్నారు. ప్రస్తుత శాసనసభ్యులలో ఉన్న ప్రజాస్వామ్య పక్షాలన్నీ కలిసి పనిచేయుటకు, ఐక్యమై స్థిరమైన ప్రజాప్రభుత్వమును స్థాపించుటకు పరిస్థితులు అనుకూలముగా నున్నవని ఈ సభవారు అభిప్రాయ పడుతున్నారు. ప్రస్తుతం ఆంధ్రదేశములో ఉన్న పరిస్థితులనుబట్టి, రాష్ట్రిము యొక్క ఉత్తమమైన శ్రేయస్సును ఎంచి నూతనరాష్ట్రిము రెండు శాసనసభలతో ఆరంభమగుట దాని హోదాకు తగియుండునని ఈ సభ వారు అభిప్రాయ పడుచున్నారు."

ఆంధ్రకాంగ్రెసు అధ్యక్షులు ఢిల్లీ నుంచి 14 వ తేదీన మద్రాసుకు రాగలరనీ, వారు వచ్చినమీదట మరల ఆంధ్రకాంగ్రెసు శాసనసభ్యులు సమావేశం కాగలరనీ తెలుస్తోంది.

### యు. డి. ఎఫ్. కార్యవర్గ తీర్మానం

మద్రాసు, మార్చి 10: డి. ఐశరథన్ గారి అధ్యక్షతను యు. డి. ఎఫ్. కార్యాలయంలో యునైటెడ్ డెమాక్రటిక్ ఫ్రంటు కార్యవర్గం నిన్న సాయంత్రం సమావేశమై ఆంధ్రప్రాంతంలోనే ఆంధ్ర రాజధానిని నెలకొల్పి నిర్వివాదమైన 11 తెనుగుజిల్లాలు, మూడు తాలూకాలతో ఆలస్యం లేకుండా ఆంధ్రరాష్ట్రాన్ని వెంటనే స్థాపించాలని తీర్మానించారు. సరిహద్దుల నిర్ణ

(8 వ పేజీ చూడుడు)

## రాజాజీ మాటపైనే కేంద్ర ప్రభుత్వం ఒక నిర్ణయానికి రాదు

### వాంచూ నివేదికపై అధిష్ఠానవర్గ చర్చ: అధికార వర్గాల సూచన

(స్వకీయ విలేఖరి)

న్యూఢిల్లీ, మార్చి 9: వాంచూ నివేదికను తాము స్వయంగా చూడకుండానే, కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు ఆ నివేదికపై నిన్న దీర్ఘంగా తర్జన భర్జనలు సాగించారు.

రాజాజీకి మాత్రం ముందుగానే నివేదిక ప్రతి అందజేయబడింది. సంజీవరెడ్డిగారు తమ వాదం అంతా వట్టి పూర్వ మీదనే సాగించవలసి వచ్చింది. ఆంధ్రరాష్ట్రాన్ని గురించిన చర్చలో మొత్తం నల్గురు సభ్యులు పాల్గొన్నారు వాదవివాదలన్నీ, మద్రాసులో ఆంధ్రరాష్ట్రి తాత్కాలిక రాజధానిని ఏర్పాటుచేయాలా? వద్దా? అనే విషయంమీదనే ప్రధానంగా జరిగాయి. ఆంధ్ర రాష్ట్రిం తాత్కాలిక రాజధానిని మద్రాసులో ఏర్పాటు చేయడానికి కేంద్ర ప్రభుత్వం నిర్ణయించే యెడల, తనకంటే "శక్తివంతుడున్నూ పెద్దవాడున్నూ" అయిన మరోవ్యక్తి యెవరైనా రాష్ట్రి పరిపాలనా బాధ్యతను వహించవలసి వుంటుందని రాజగోపాలాచారిగారు బెదిరింపుగా అన్నప్పటికీ, మద్రాసురాష్ట్రి విభజనత్వరలో జరిగేటట్లు చూస్తాననిమాత్రం ఆయన హామీయిచ్చారు పోతే ఈ సందర్భంలో ఆంధ్రులకు పనిలోపనిగా ఆయన ఏవో తనకితోచినసలహాలు కూడా కొన్నియిచ్చారు రాజధానిని ఎక్కడ యేర్పాటుచేసుకోవాలీ అనే విషయమై ఆంధ్రులు యింకా ఏకాభిప్రాయానికి రాలేకుండావున్నారు గనుక అటి ఏకీభావంకుదిరేవరకు ఆంధ్రులు వేచివుండడమే యుక్తమని ఆయన సూచించినట్లు తెలుస్తున్నది.

ఇక కుట్టిమాలుఅమ్మగారు పరిశిష్ట రాష్ట్రింలోని ఒకప్రాంతానికి ప్రతినిధిగా, ఆంధ్రరాష్ట్రి తాత్కాలిక రాజధానిని మద్రాసులో వుంచటం ఏమాత్రం వాంఛనీయంకాదని వాక్రుచ్చినట్లు తెలుస్తున్నది.

కామరాజనాడార్ గారు, "మద్రాసు నగరంలో ఆంధ్రులకు పరిపాలనాధికారం అంటూ యేమీ వుండబోయేదిలేదు గనుక, ఆంధ్రులు తమ రాజధానిని ఆదినుంచీ కూడా మరోచోట ఎక్కడైనా ఏర్పాటు చేసుకోవటమే శ్రేయస్కరమని" అన్నారు.

సంజీవ రెడ్డిగారు తమ ప్రసంగంలో రాజగోపాలాచారిగారికి గట్టిగా సమాధానం యిచ్చారు. రాజాజీ యిస్తున్న సలహా సహాయాలతో ఆంధ్రులకు యిదివరకే కడుపు నిండిపోయిందనీ, ఇక ఆయన ఆంధ్ర వ్యవహారాలలో జోక్యం విరమించుకోవటమే అందరికీ శ్రేయస్కరమనీ, సంజీవ రెడ్డిగారు హెచ్చరిక చేసినట్లు తెలుస్తున్నది. కేంద్ర ప్రభుత్వం ఆంధ్ర రాష్ట్రాన్ని నిర్మించదలచి స్థితిగతులను నిష్పాక్షికంగా పరిశీలించేందుకూ, నిష్పాక్షికంగా కర్తవ్యాన్ని నిర్దేశించేందుకూ

(5 వ పేజీ చూడుడు)

## ఆంధ్ర మంత్రివర్గ స్థాపనకు వీలుగా మద్రాసుమంత్రివర్గవిస్తరణ

### కృషిక్ లోక్ ప్రజాపార్టీ ను వదిలివచ్చేవారికి ప్రాతినిధ్యం

### ఢిల్లీలో రాజగోపాలాచారిగారితో రంగాగారి చర్చలు

(స్వకీయ విలేఖరి)

న్యూఢిల్లీ, మార్చి 9: నిన్న కాంగ్రెసు కార్యవర్గ సమావేశం ప్రారంభం అవడానికి పూర్వం కృషికార్ లోక్ పార్టీ నాయకుడు ఎన్. జి. రంగాగారు రాష్ట్రిపతి భవనంలో శ్రీ సి. రాజగోపాలాచారిగారిని కలుసుకొని, ఆంధ్రలో మంత్రివర్గ నిర్మాణానికి కావలసిన బలాన్ని లోక్ పార్టీ సమీకరించగలదని హామీ యిచ్చినట్లు తెలుస్తున్నది.

లోక్ పార్టీ, కాంగ్రెసు, కొంతమంది స్వతంత్రులు, ప్రజా సోషలిస్టు పార్టీని వదిలిపెట్టే 8 మంది సభ్యులూ కలిసి ఆంధ్రలో మంత్రి వర్గాన్ని సుస్థిరమైన దానిని ఏర్పాటు చేయగలరని రంగాగారి అభిప్రాయమైనట్లు తెలుస్తున్నది.

రాజాజీ తన మంత్రివర్గంలోకి త్వరలోనే అదనంగా మరి ఇద్దరు, ముగ్గురు సభ్యులను తీసుకోవచ్చునని భావించబడుతున్నది. వీరిలో ఒకరు మాజీ ప్రజా సోషలిస్టుపార్టీ సభ్యులై వుంటారనీ, తక్కినవారు లోక్ పార్టీ సభ్యులై వుంటారనీ ఊహించబడుతున్నది.

వెంటనే ఇట్లా మంత్రి వర్గాన్ని విస్తరించటంలోవున్న సౌలభ్యం ఏమిటంటే, ఆంధ్రరాష్ట్రిం ఏర్పడగానే మంత్రివర్గం సిద్ధమై వుంటుంది. భావి ఆంధ్రరాష్ట్రి ప్రభుత్వానికీ ప్రస్తుత ప్రభుత్వానికీ మధ్య అనుస్యూతమైన సంబంధం ఈ విధంగా ఏర్పడినట్లవుతుంది.

### యం. కె. వెల్లోడీకి నూతన పదవి

#### కేంద్రప్రభుత్వంలో కార్యదర్శిగా నియామకం

హైదరాబాదు, మార్చి 10: హైదరాబాదు సంస్థాన సలహాదారైన యం. కె. వెల్లోడీగారు యూనియన్ ప్రభుత్వంలో గృహవసతి, సరఫరాలమంత్రి వర్గ కార్యదర్శిగా నియమింపబడినట్లు ఇవాళ ఇక్కడ నమ్మకంగా తెలియవచ్చింది. వెల్లోడీగారు తమ నూతన పదవిని వచ్చేనెల మొదట్లో స్వీకరిస్తారు.

### మద్రాసుకు ముఖ్యమంత్రి ఆగమనం

మద్రాసు, మార్చి 10: మద్రాసు ముఖ్యమంత్రి శ్రీమాన్ రాజగోపాలాచారిగారు నేటి మధ్యాహ్నం ఢిల్లీ నుంచి మద్రాసు చేరుకున్నారు.

## బిరైమీ ప్రాంత ఆక్రమణకు బ్రిటిష్ ప్రభుత్వ సన్నాహం

### పెర్షియన్ సింధుశాఖ సుల్తాన్‌లతో కుట్రపన్నుతున్నట్లు సౌదీ అరేబియా ఆరోపణ

సౌదీ అరేబియా, మార్చి 9: సౌదీ అరేబియాలో అంతర్భాగమైన బిరైమీ ప్రాంతాన్ని కాజెయ్యాలనే వుద్దేశ్యంతో బ్రిటిష్ ప్రభుత్వం పెర్షియన్ సింధుశాఖలో సుల్తానులతో కుట్రపన్నటమే కాక, యథాతథపు ఒడంబడికను సర్వవిధాల భగ్నం చేస్తున్నదనీ, బ్రిటిష్ అధికారులు సాగిస్తున్న ప్రతికూల చర్యలను గురించి, ఐక్యరాజ్య సమితికి త్వరలో ఫిర్యాదు చేయుటం తప్పదు వలె కన్పిస్తున్నదనీ, నేడు సౌదీ అరేబియా విదేశాంగ కార్యాలయం ఈవేళ ప్రకటించింది.

"ఈబిరైమీ ప్రాంతం న్యాయతః తనకు చెందవలసిందని మస్కట్ సుల్తాన్ అంటున్నట్లుగా బ్రిటిషుఅధికారులు ఈ మధ్య ప్రచారం ప్రారంభించారు. ఈ వివాద శాంతియుతంగా పరిష్కారం అయ్యేవరకు ఇరుపక్షాల వారు యథాస్థితికి భంగం కల్గించకూడదని అమెరికా సూచించగా బ్రిటన్, సౌదీ అరేబియాలు అందుకు అంగీకరించి, ఆ ప్రకారం యథాతథపు ఒడంబడిక ఒకటి కుదుర్చుకున్నాయి.

వివాదగ్రస్తమైన ప్రాంతంలో జనవాక్య నిర్ధారణజరిపి తద్వారా ఈ సమస్యను పరిష్కరించ వలసిందని సౌదీ అరేబియా ప్రతిపాదించగా, బ్రిటిషు అధికారులు అందుకు నిరాకరించారు. వ్యవహారం శాంతియుతంగా పరిష్కారం కావటం బ్రిటన్‌కు ఇష్టంలేదని దీనివల్ల తేలుతున్నది. ఇది ఇలా వుండగా బ్రిటిషు అధికారులు యథాతథపు ఒడంబడికనుకూడా ఉల్లంఘించడానికి ప్రారంభించారు. బిరైమీ ప్రాంతంలో బ్రిటిషు విమానాలూ మిలిటరీ వాహనాలూ విచ్చలవిడిగా తిరుగుతున్నాయి." అని విదేశాంగ శాఖ వివరించింది.

## ఆసియాదేశాల్లో అమెరికా విదేశాంగ కార్యదర్శి పర్యటన

### మేనెల్లో భారతదేశానికి జాన్ ఫాస్టర్ డల్లెస్ రాక

#### ఢిల్లీ-కరాచీ వివాదాల పరిష్కారానికి కృషి?

ఐక్యరాజ్య కార్యాలయం, మార్చి 9: అమెరికా విదేశాంగమంత్రి జాన్‌ఫాస్టర్ డల్లెస్ ఈవేళ యిక్కడ పత్రికా ప్రతినిధుల సమావేశంలో ప్రసంగిస్తూ, సమీపప్రాచ్య ఆగ్నేయ ఆసియా దేశాలలో పర్యటనార్థం తాను మేలో బయలుదేరాలని ఉద్దేశిస్తున్నాననీ, ఆ సందర్భంలో తాను ఇండియా ఇజ్రేల్ లుగూడా సందర్శించగలననీ వెల్లడిచేశారు.

"ప్రపంచ రాజకీయాలలో సమీప ప్రాచ్యదేశాలకు గల ప్రాముఖ్యాన్ని అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ గుర్తించి వున్నారు. ఆ దేశాలకు ఎంతో సంపన్నమైన సంస్కృతి వుంది. అమెరికా ప్రజలు ఆ సంస్కృతిని కొంత స్వకీయజీవితంలో అంతర్భాగం చేసుకొని వున్నారు. ఈ అన్ని కారణాల వల్ల ఆ దేశాలయెడ మాకు గాఢమైన అనురాగం సౌహార్ద్రభావం ఏర్పడివుంది. ఈ భావాలను వారికి తెలియజేసే నిమిత్తం ఆదేశాలకు స్వయంగా నన్ను వెళ్ళిరావలసిందని అధ్యక్షుడు ఆదేశించారు. అయితే ఆదేశాలకు వెళ్లేటప్పుడు నాతో నిర్దిష్టమైన పథకం అంటూ ఏదీ తీసుకువెళ్లను. కేవలం పాతస్నేహాలను పరిచయాలను తిరగ చేసుకోవటమే నా ఈ పర్యటనలో ముఖ్యోద్దేశం. ఇతఃపూర్వం అమెరికా విదేశాంగ మంత్రులెవ్వరూ ఈ దేశాలకు వెళ్లివుండలేదు. ఆ గౌరవం నాకు త్వరలో లభించగలదని ఆశిస్తున్నాను"

"ఇండియా పాకిస్థాన్‌ల అన్యోన్య సమస్యలను గూర్చిన ప్రస్తావనను ఆ ప్రభుత్వాలు నాముందు తెచ్చేటట్టయితే వాటిని చర్చించడానికి నా అభ్యంతరం ఏమీలేదు" అని జాన్ ఫాస్టర్ డల్లెస్ ఒక విలేఖరి వేసిన ప్రశ్నకు జవాబుగా చెప్పారు.

"ఈ రెండు దేశాల మధ్య అనేక వివాదలు ఏర్పడి వున్నాయి. కాని ఆ దేశాలలో నేను గడపదలచుకొన్న స్వల్పకాలంలో అయా సమస్యలను నేను పరిష్కరించ గల్గుతానని అనుకోను. ఇండియా పాకిస్థానుల మధ్య సామరస్యం ఏర్పడాలని అమెరికా వాంఛిస్తున్నది. ఐక్యరాజ్య సమితిలో కూడ అనేక పర్యాయాలు అమెరికా అమెరికా ప్రతినిధులు ఈ భావాన్ని వ్యక్తంచేసి వున్నారు." అని డల్లెస్ వివరించారు.

### పంజాబు నీటికాలవల తగాదా

#### ఇండియా పాక్ ప్రధానుల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు

కరాచీ, మార్చి 9: కాల్వ నీటి తగాదా విషయంలో అంశాలను గురించి గడచిన రెండురోజులుగా నెహ్రూ నజీముద్దీన్ లమధ్య మళ్లీ కొన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగినట్లు నమ్మకంగా తెలుస్తున్నది. ఈ ఉభయులమధ్య 3 నెలలుగా సాగుతున్న ఈ ఉత్తర ప్రత్యుత్తరాలు వెంటనే కాకపోయినా మరికొంత కాలానికైనా తప్పక ప్రచురించబడగలవని అనుకుంటున్నారు. పాకిస్థాన్ విదేశాంగమంత్రి జఫ్రుల్లాఖాన్ ఈవేళ పార్లమెంటులో ఒక సభ్యుని ప్రశ్నకు జవాబిస్తూ, యుద్ధ నిషేధ ఒడంబడిక ప్రతిపాదనను పాకిస్థాన్ ప్రధాని నిరాకరించినమాట నిజం కాదనీ, ఉత్తర ప్రత్యుత్తరాలను ప్రస్తుతదశలో విడుదలచేయటం క్షేమకరంకాదని ప్రభుత్వం అభిప్రాయపడుతున్నదనీ తెలియజేశారు.

## స్టాలిన్ శకం అంతమై 'ఐక్' శకం ప్రారంభమైనదట

### సోవియట్ ప్రధాని మృతిపై డల్లెస్ వ్యాఖ్య

యునైటెడ్ నేషన్స్, మార్చి 9:— ప్రపంచంలో శాంతి సామరస్యాలకు స్టాలిన్ ప్రతిబంధకమైనట్లుగా ఆయన వారసుడు ప్రతిబంధకం అవుతాడని తాను అనుకోననీ, అందువల్ల స్టాలిన్ మృతి ప్రపంచశాంతికి సహాయభూతం కాగలదనే తన అభిప్రాయమనీ అమెరికా విదేశాంగమంత్రి జాన్ ఫాస్టర్ డల్లెస్ ఈవేళ ఇక్కడ పత్రికా ప్రతినిధుల సమావేశంలో ఒక విలేఖరి ప్రశ్నకు జవాబుగా తెలియజేశారు.

"స్వాతంత్ర్యం, మానవహక్కులు శాంతి వీటిని సామాన్య ప్రజానీకం ఏదేశంలోను ఏకాలంలోను గూడా అభిలషిస్తూనే వుంటారు. సోవియట్ రాజ్యాల కూటమిలోనే కాదు. ప్రపంచంలో సర్వత్రా ఈ అభిలాష ప్రజల హృదయాలలో అంతర్గతమైవుంది. కాని ప్రపంచానికంతకు తాను అధినేతను కావాలనే ఆశయంతో స్టాలిన్ సామాన్యప్రజల ఈ ఆశలను మట్టుపెడుతూ వచ్చాడు.

స్టాలిన్ శకం అంతరించి ఐసెన్‌హోవర్ శకం ప్రారంభమైందనీ, ఈ పరిణామదశలో ఐక్యరాజ్య సమితిలోని ఇతర ప్రాచ్యదేశ నాయకులను కలుసుకొని వారితో పరిచయం వృద్ధిచేసుకోగోరుతున్నాననీ, డల్లెస్ ఐక్యరాజ్య సమితి కార్యాలయానికి వచ్చిన సందర్భంలో ఈవేళ వ్యక్తంచేశారు.

### గ్రామాలలో సంఘ సేవా కృషి

#### చాలా అవకాశం కలదని రాష్ట్రిపతి ప్రసంగం

కస్తూర్బా గ్రామ్, మార్చి 9: నిస్వార్థులైన సంఘసేవకులు చేసేందుకు గ్రామాలలో కావలసినంత పని వున్నదని రాష్ట్రిపతి రాజేంద్రప్రసాద్ నేడు కస్తూర్బాఆశ్రమంలో అన్నారు. భారత దేశంలో రక్షకుల గ్రామాలంటే ప్రభుత్వ ప్రణాళికల క్రిందకు వచ్చినవి 15 వేలు మాత్రమేననికూడ ఆయన అన్నారు. గాంధీజీ, కస్తూర్బాల పేర్లతో వుండే సంస్థలు ఆర్థికంగా స్వయం పోషకాలైవుంటూ, గాంధీజీ ప్రవచనాలనూ, ఆశయాలనూ వ్యక్తీకరించేవిగా వుండాలన్నారు. భారతదేశవిద్యా సమస్య వార్ధా ప్రాతిపదిక విద్యావిధానం ద్వారానే తీరుతుందనీ, ప్రజానీకం అవసరాన్ని కావడానికి ఆ దేశ మార్గమునే కూడా అన్నారు.

## "కొరియా ఏకీకరణ కమిషన్‌ను రద్దుచేయాలి"

### సమితి రాజకీయ సంఘంలో సోవియట్ రష్యా ప్రతినిధి వాదం

ఐక్యరాజ్యకార్యాలయం, మార్చి 9: రష్యా ప్రతినిధి వాలేరియన్ జోరిన్ ఈ వేళ ఐక్యరాజ్య సమితి రాజకీయ కమిటీ సమావేశంలో ప్రసంగిస్తూ, కొరియా పునరుద్ధరణ ఏకీకరణల నిమిత్తం ఐక్యరాజ్య సమితి ఏర్పాటుచేసిన కమిషన్ తన కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహించటంలేదనీ, అందువల్ల ఆ కమిషనను రద్దు చేయాలనీ, ప్రతిపాదించాడు. "లోపాలను పులిమి పుచ్చి ప్రయోజనంలేదు; వున్న యథార్థాన్ని గుర్తించి అందుకు అనుగుణంగా వ్యవహరించటమే కర్తవ్యం" అని ఆయన హెచ్చరిక చేశారు. కొరియా ప్రజల పునరుద్ధరణకు కమిషన్ చేస్తున్న కృషిని ప్రశంసిస్తూనూ, కమిషన్‌కు సర్వశక్తులా తోడ్పడవలసిందని వివిధ దేశాలను అర్థిస్తూనూ, బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సు మొదలైన 8 రాజ్యాలు తీర్మానాన్ని ప్రతిపాదించగా, రష్యన్ ప్రతినిధి దానిని ప్రతిఘటిస్తూ పైవిధంగా ప్రసంగించాడు.

పాశ్చాత్య రాజ్యాల తీర్మానం 54 ఓట్లతో ఆమోదించబడింది; 5 దేశాలు తీర్మానాన్ని వ్యతిరేకించాయి; ఒక దేశంమాత్రం తటస్థ్యం వహించింది.

ఆ తర్వాత కమిషన్‌ను రద్దు చేయాలంటూ రష్యా ప్రతినిధి ప్రతిపాదించిన తీర్మానం ఓటుకు పెట్టబడింది; 5 దేశాలు మాత్రమే అనుకూలంగా వోటు చేయటంవల్ల రష్యా తీర్మానం వీగిపోయింది.

